ఓమ్

# కందశతకము

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీనిత్యానంద స్వాములవారి

యాజ్ఞాను సారముగ

కాజ వేంకటప్పయ్యచే

రచియింపఁబడి

కృష్ణాస్వదేశీ ముద్రాక్షరశాల యందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

అమూల్యము

—:o:—

డిశంబరు 1909 సం॥

# పీఠిక

—:0:—

1. సర్వజ్ఞానమనంతము,
నిత్యము నీధ్యానమందు నిలుపుచుంటిన్
పుస్తకము నంటి జెప్పిన,
నిత్యానందుం డనంగ నిజగురుగొల్తున్.

2. కందంబు లనెడిపూవుల
నందముగా గూర్చి నీకు నర్పింపంగా
సందియ మొందక మాలిక
నందుకొనన్ గోరినాడ నరమరశేఖరా.

3. ఛందంబుల నెఱుగక నీ
కందంబులు జెప్పినాడ గవివరులారా
యిం కెన్ని దప్పులున్నను
నందముగా దిద్దవలయు, నరమరశేఖరా.

4. కౌండిన్యసగోత్రంబున
పాండిత్యము గలిగి వేదపఠనములందున్
మెండగుచు రాజవారిలో
తండ్రిని లక్ష్మావధాని తప్పక గొల్తున్.

5. ముగ్గుర యమ్మల కెల్లను
నిగ్గగుచున్నట్టి సాధ్వి నిరతియశాలిం
దగ్గుల గోరక చేతుల
నొగ్గద నావర్ధనమ్మ ననుబ్రోచుటకున్.

6. బందరుపురమున నుండును
సుందరమగు గొడుగుపేట సుదతుల బడిలో
నుండును హేడ్మిస్ట్రెసుగా
యందరు నను కరుణజూడనగు గాకనుచున్.

7. వెంకటప్పయదాసుడ
శంకలు నాయందు లేవు శంకరుడెరుగున్
యింకేమి తప్పులున్నను
పొంకముగా జేసి నన్ను బ్రోచినగొల్లున్.



వెను వెంట ఘనుల జాడలు
గనుచున్న నమరగవలెను వినయమున గోరన్

6. గురువును నక్షరద్వయమున
నిరుపమునుండుటను నీవు నెరుగుదువుగదా
గురియుంచిజూడ ముందర
దరగని సంపదల నొసగ స్థిరముగనుండెన్ ॥

7. నరులకు ముక్తికి మార్గము
స్మరణే సులభంబటంచు నరిగెను బుధులా
సరియగు దారిను బోయిన
హరిపురములో జేరవచ్చు నరనిమిషములోన్.

8. మరియవు దేహము నేనని
మరణంబన వెరపునీకు మరియుండదుగా
మరణము జన్మములకు యను
పురమేదను గలదో నీవు నెరుగగ వలెనే.

9. శరణాగతులగుచును మన
కరములు మోడ్చియును వాని కరుణను గోరన్
నిరుపమ బోధలు సేయును
పరిపూర్ణుండయ్యుండు హరుడీ గురుడున్.

10. బాలాగోపాలాములు
నేలాబోరి చదవో మోహ జాలంబుల కన్
వ్యాలులమై గాలయముతో
[illegible].

16. అన్నది మాయయనునది యొక
టున్నది నీలోన నేమి యున్నది మరినీ
గన్నుల కగుపడు చున్నది
విన్నపము స్సేయుచున్న వాడను నేనే.

17. తన్నని తెలియగలేకను
గన్నది యంతయును భిన్న మనిదలచుమనం
బున్నంతవరకు జన్మము
లెన్నెన్నో యెత్తుచున్న వానికి స్థిరమే.

18. ఏన్నో విధములటంచును
నెన్నిక సేయంగలేము యెన్నో వన్నెల్
యున్నా వృల బాలన్నియు
గన్నంతనె వ్యత్యయంబు గల్గునె చెపుమా.

19. మచ్చలు మాయన్ననగా
నచ్చునుగోపంబు చాల హెచ్చగ నపుడే
విచ్చియు జూచిన యర్థము
నచ్చిత్తానందమనుచు నచ్చును భావం.

20. తెచ్చియు కోరియు దేహము
జొచ్చిన మోహమును నపుడు ముచ్చట పడుచున్
వచ్చిన కీడులు జూచిన
నొచ్చుకొనద నపుడు యంతో పిచ్చిమనసా॥

21. యిచ్చలె యెప్పుడు మోసము
పుచ్చును నను కోవ్వ నీవు తుచ్ఛపుదానా
విచ్చలవిడిగా త్రిప్పుచు
రొచ్చులోఁబడద్రోసియు తుదకు మచ్చికతోడన్.

22. సరిబేసి జేసి కనులను
సరిగా శిరమునకు పైన వరపీఠమునన్
నిరుపమ స్థానమునను నీ
గురినిల్పినవాడె మనకు గురుఁడనబరగున్.

23. పరుగులు నెత్తుచు పోవుచు
చరణములకు మ్రొక్కి నీదు కరములు మోడ్చన్
నిరుపమ బోధలజేయఁగను
మరలము యిక యెపుడు జన్మముల కదిస్థిరమే॥

24. అద్దమున జూచి మోమును
దిద్దుకొని నవభంగి నీవు పెద్దలనడకే
పొద్దును వినుమను మదిలో
నద్దుకొనుము లోపములను ముద్దులగుమ్మా॥

25. హద్దును మీరక నిజగురు
వద్దను జేరియును బోధ శ్రద్ధతో వినుచున్
బద్ధానురాగి యగు నీ
బుద్ధిలో సర్వంబు నీకు సిద్ధము గదవే.

26. దుంప తెగనరక యని రూ
చింపుము మొలకుద్భవింపక చెప్పటివలె నీ
కింపుగ దోఁచిన సంశయ
దుంపను దెంపితివ యిఁక జనింపవు భువిలోఁ.

27. వంప్పైన భావనింద్రియ
గుంపును తన వైపునకు మళ్లింపుచు నీకుఁ
సొంపుగ గనబడుచును ని
న్నంపును జన్మములకు నని తలంపుము నీవుఁ.

28. తలపండు పండి పగిలిన
తలప నశక్యంబైయున తెలుపను లేనా
ఫలముల మాధుర్యము భూ
వలయములో నున్న సజ్జనుల కెరుక గునా.

29. ఫలవాసన సోకిన మన
మలినం బంతయును బోయి చలనము లుడుగుఁ
కలకలమని సుగుణంబులు
మొలకలు నెత్తంగ మనము గులుకుదు మపుడుఁ

30. కలవర పెట్టుచు మనలను
చిలవరముగ త్రిప్పినట్టి బలశాలులు యా
ఖలులగు[illegible]కామాదులు నిఁ
దొలగియు పోవుదురెగాని నిలువగలేక.

31. నోరును కనులను మూశియు
దారింగన భువనములను మీరుదువపు ధీ
దారి; గురుజెంత జేరని
వారలు నెన్నటికి దెలియ నేరరుసుధీ

32-ఆరును మూడును సొాష్టల
క్ష్యారును మనలోన చుట్టు జేయటవలనన్
పేరలతో బొత్తు గలిగిన
గారణమున జన్మములకు గారణమాయెన్.

33. కోరిన వచ్చిన దేహము
కారాగృహమనియు నీవు చోరుడ నంచున్
తీరున యోచన సేయక
శూరుడ నని తిరిగి దిరిగి ఘోరున నేడ్వన్.

34. ఏరులు మూటికి నవ్వల
పేరును నామంబు క్రియలు మీరిన రాజ్యం
జేరిన మహానుభావులు
ఛారింకను జన్మములకు ధీరులెమనసా.

35. త్రాడు తెగిన విడిపోవును
జోడున్గలియంగ లేవు వేడుక యున్నన్
మూడున్ గాల్వలు దాటియు
నడినాడికిఁగోనయున్న మేడలోయుండున్

36. ఏడేడు భువనములకును
తోడగుచు న్వెలుగుచుండు రూఢగ వానిన్
నీడలు సోకిన మాత్రన
గాఢంబగు చీకటపుడు వీడును సువ్వీ

37. పాడు యని మాటదలచుచు
గోడున్ జెంపెదవు నెపుడు నాద్ధానివలెన్
గూడని యర్థము జేయుచు.
బాడించుచు నుంటివేసి గాడ్గెలు కామా.

38. బోధితలవలెను దలపులు
బోడియు నైనాడ దుత్త మోత్తమురాలే
జూడను పాపక్షయమగు.
వేడను బంధంబులూడు తోడనె మనకున్.

39 కుడియెడమ నాడులను మన
మెడ తెగకను మొలకువుగను వడి గానూదన్
గమపులా నవలజ్వాలలు
నడినెత్తికి నెగయు రెండు ఘడియలలోనన్

40. గడబిడలేనాబాటలో
నడువగ నీయింద్రియంబు లనుపడచుల్వా
రడుగడుగున గురుబోధలు
నడుపుచు గడుసంతసమున పెడలెదరపుడే.

41, తడయక గురువందనములు
ముడిచి గరంబు లను వేడి కడతేర్చుమనఁగ
గుడమునకన్న తీపౌ
దృఢబోధలు జేయువారు ముడివిడిపోవఁగ .

42. నక్కవలె నీవు యుండియు
పుక్కిట్లపురాణకథలు పెక్కులు జెప్పఁగ
డొక్కను నింపుదు విప్పను
చిక్కులాం పడిపోదు వెపుడు నిక్కముసుగ్రా

43. ముక్కనకు సాటిగా పై
కెక్కిన నీనిజమునీకు గ్రక్కున దెలియుఁగ
చక్కని మార్గము దీనిని
ప్రెక్కియు గురుబోధ వినుము మక్కువజేతఁ.

44. రక్కసులనియెడి తలపులు
గ్రిక్కిరిసియు వచ్చునపుడు ప్రక్కలగుండా
నుక్కడగించుచు మఱియును
ముక్కలగానరికి వైచి త్రొక్కుము బాప్పిస్తా.

45. అక్కడ మంగళ ప్రదమగు
తెక్కము పైనున్న గురువు దిక్కుల నిండఁగ
పిక్కటిల్లుచు వెలుగును
టక్కరిమాటనక నీవు నక్కరవినుమా.

46. తిండికి పోతులమై బహు
దండెము లెన్నెన్నో తీశి కండలు పెంచన్
దండుగ పనులై బోవును
యుండదు యప్పటికి దేహముండదు నిజమున్.

47. చండిబడి బుద్ధి వెలిలో
నిండుండగ యమునిభయము నుండిన గానీ
పుండరీకాక్షునికృపలో
నుండియు సేవించు వాని కుండదు భయమున్.

48. రెండొకటిజేసి సద్గురు
కుండలి భేదించు నేర్పు చండిగ జెప్పన్
మండలము లన్ని దాటియు
వుండనె నీవప్పుడు పండువెన్నెలలోనన్

49. తప్పొప్పులు దెలియను మన
కిప్పుడె సమయంబటంచు చెప్పిరి బుధులా
చొప్పుననడచిన నీయడ
జెప్పనలవిగాని సుఖము తప్పగ బొందున్

50. పప్పును పరమాన్నంబును
నప్పంబులు మెక్కి దానినగు పైకమునా
త్రుప్పటితో చేసిన నీ
దుప్పట్ల ముసుంగులోన దులగూగెదవా.

51. మెప్పుగనీషణత్రియమను
నిప్పులు నిను జుట్టుకొనుట నిప్పటి కైనన్
రెప్పలు విప్పియు జూడవు
కప్పును నిది నిశ్చయంబు తప్పకనిన్నున్.

52. ముప్పున మృత్యువువాసన
గప్పిన మనశక్తియంత జప్పనబోవున్
దిప్పగలేకను భ్రాంతుల
తిప్పలు యన్నెన్నొ బడుదు రొప్పగనసునే

53 అప్పిచ్చినవారెల్లరు
నప్పుడు నడుగంగవచ్చు నటులను గుప్పల్
దప్పనుచు చప్పనాతులు
నొప్పింపగవచ్చు నపుడు జెప్పనవినవే.

54. ఉబ్బను కోపము గర్వము
జెబ్బరగుణ జాలమంత నిబ్బంధులతో
దబ్బరబోధలు సేయును
తబ్బిబ్బుల నొందజేయు నిబ్బరమనమా.

55. బెబ్బులి వంటిది మోహము
గొబ్బున మ్రింగునని తెలియ కుబ్బుచునున్నన్
దెబ్బలో రొంపిలో బడగను
నొబ్బగ నబ్బొబ్బయనుచు బొబ్బలనిడెదా.

56. ఎల్లోకములను తనదగు
యుల్లమునం దుండగలిగి నెల్లరిలో బయల్
గొల్లగను తేజరిల్లిన
నల్లయ్యే కృష్ణుడనగ జెల్లును వానిన్.

57. తల్లెగు దేవకి కడుపున
నల్లయ్యాయె జననమంద నటు పైమాయన్
చల్లగనునింప సేవకు
లెల్లరునుం సొమ్మసిల్లి నిదురం జెందన్.

58. గొళ్లెంబులూడె తలుపులు
పెళ్లున విడిపోయె తండ్రి యుల్లాసమున్నన్
వెళ్లెను శీఘ్రమ్ముగ రే
పల్లెగానున్నట్టి పెద్దగొల్లల జేరన్.

59. తల్లియశోదకు ముద్దుల
పిల్లడుగను యుండె తాను పెరుగుచునుండెన్.
పిల్లలతో నాడువేళల
నల్లరిపను లెంతో మహిమ వెల్లడిపరచెన్.

60. ఎంతని జెప్పుదు ప్రకృతిని
సుంతే కాలంబు విడక నంతము నొందున్
వింతైన నామరూపపు
సంతలకూటంబటంచు చింతింపదగున్.

61. చింతలతోఁ టనినమ్మక
వింతలె యుల భ్రాంతిజన్య మంత్రనుకొమ్మి
గంతులువేయుచు కుళ్లిన
బొంతలో నీవుండి సంతసిల్లుటదగునే

62. మంతనమున శ్రీసద్గురు
చెంతను బోతంతికన్న నతివేగముగా
నంతయునీవను భావము
నింతేకాలమున బోధజేతురు వారల్.

63. జంతువులనుపట్టను తన
తంతువులతో స్వంతముగను తత్కృతవలలో
వింతగ జిక్కిన సాల్పురు
గంతేయని జన్మహేతు వింతని సుమతుల్.

64 సతతంబు నాత్మయొక్కయు
స్థితి నెరిగినవార లూర్ధ్వగతి కేగెడిచో
నతిసమర సైక్యమున్గను
రతినల్పుచు జెందగలరు తుదిసద్గతికిన్.

65. మతిహీను లగుచు నధమపు
గతికేగదలంచిదోలు ప్రతిమల యొక్కన్
రతులాసక్తులమై దు
ర్గతి పాలగుచుంటిమిపుడు క్షితిలో మనమున్

66 ధృతితో కామాద్యాదుల
హాత మొనరింపకయు చాతురత దెలియదుగా
నతిప్రీతితోడ శ్రీయః
పతి నావశ్యంబు వేడు మతిశయ మొదవన్

67. ఆతను నిత్యుడు నిర్మలు
డాతడు కళశాలి స్తోత్రస్తుతిపాత్రుండున్
స్మృతిఇతిహాసపురాణము
లతులితగతి జదివితేని నన్నియు దెలియున్.

68 గతజన్మంబుల కోరిక
లతికాంక్షతో వేడినాను యాకోరికలన్
గతి మన కెదురైవచ్చెను
హితముగ ననుభవము జాగ్రతతో మెలగదగున్

69 భావమునం దెడ దెగకను
సేవను జేయంగగోరి జెవి యొగ్గితిగా
యేవిధమున నుందుచు లో
నీవే నాకిపుడు దెల్పు పావన మూర్తీ.

70. కావరమంచును దెలియక
నేవేవియుజేసి లేవలేనోతండ్రీ
గావున క్షమాపరాధము
త్రోవంజూపంగ నీవె దిక్కైరావే.

71. భూవరదాయకుఁడవు యో
భావాతీతుండ శుద్ధపరమాత్ముండా
పావనునిజేసి బ్రోవను
నీవేకద దైవ మొకరి నే నెఱుగను గా.

72. ఎన్నను బనిలేదేమియు
దిన్నగ యోచించ నిన్ను పన్నుగ నెఱుగన్
నన్నును సర్వంబును నెరి
గున్నాడవు యనుచు నిన్ను యన్నరె బెద్దల్.

73. కన్నులకు బొరలు వేసియుఁ
బన్నినచీకటిలో బైగ నున్నను మనమున్
పున్నమ జంద్రుని యొక్కయు
వెన్నెల జాడెటుల గందుమన్నా విన్నా.

74. మన్ననతోడను నిజగురు
సన్నిధిలో జేరినీవు శ్రద్ధతో నుండన్
యున్నిటికంటెను మిక్కిలి
మిన్నైనది భావమనగ నున్నె తెలుపున్.

75. నిన్నెన్న నామరూపము
లెన్నెన్నో గలిగియున్న యభిమానుడనే
నన్నట్టిసంగదంతయు
నన్నియు నీతోడబోవునని తెలుసుకొవు గా.

76. వంకర లేకను మనసును
పొంకముగానుంచి మనల వంకను జూడన్
శంకలుదీరును రహితక
శంకులనై యుండుమపుడు శంకరు కృపచేన్.

77. అంకురమగు జీవులలో
సంకులమై హరుడు యుండ కుంకలమగుచున్
నింకైన దెలియలేకను
జంకులాపలి బల్కెదమర బింకము చేతన్.

78. మంకుతనములు మానను
శృంఖలించియును మోహ సంకెళ్లలో నం
డింకైన దెలియకున్నను
లంకెలు మరిపోవు పొద్దుగ్రుంకునె మనసా.

79. ఆమహాపురుషుండనగా.
నామము రూపంబు రహితు డత డేమందున్
నీమముదప్పగ దమలో
దామే జూడంగ రెండు జాములలోనన్.

80. పామరులగు మానవులున్
గామక్రోధముల దవిలి తామసులగుచున్
నామంబు రూపక్రియలని
నేమరకను దిరిగెదరుగ భూమిలో నెపుడున్

81. స్వామీ జీవుల యంతః
ర్యామియు నై వెలుగు ననుచు ప్రేమతో మునుల్
ధీమంతు లెల్లరు జెప్పిన.
క్షేమంబిందుకయు నెఱుగ లేమనుకొమ్మా

82. కాశి నివాసుండన కై
లాసమునందుండు శ్రీసదాశివుడనగన్
భూసుర పుత్రమమై దగు
కోశాతీతుండు సామ హేశుకె జెల్లున్.

83 ఆశలు వెంటను దగిలియు
మోసంబును పుచ్చి జన్మములకు విలాసం
జేసికొనిబోయి పిమ్మట
గాసింబడియైన విడువ లేశము నేనున్.

84 దోసపువారలతో సహ
వాసము లేకుండనెపుడు జేసియు నే నీ
దాసునిగ జేర్పగోరగ
దోసిలి యొగ్గున్న వాడ నీసముల గనన్.

85. మూసియు నూయకనుండే
జేసగు నేత్రముల మిమ్ము జూచినవారల్
బాసలను వినగ వినగా
భాసిల్లను జేయధలసె నీసకలంబున్.

86. సృష్టిస్థితిలయ కారణు
దృష్టికగోచరుడు యనుచు
తుష్టిగశ్రుతులున్ స్పష్టముగ జెప్పెనాయుః
తత్స్రష్టస్థితి బొందలేవె భ్రష్టపుమనసా.

87. మృష్టహృదయములో నుండియు
వ్యష్టిగ గనుబడుటచేత దుష్టజగంబే
కష్టముల కాలయంబని
ముష్టెత్తెడి మాటలాడ నిష్టము మనసా.

88. ఓసీ వినవే మనసా
రోసియు సర్వము మదిలో జూచినదెల్లన్
నాశమునొందును గనుకను
నాశలలో జిక్కినీవు మోసముబోకే.

89. కూసెడి గాడిదవచ్చియు
మేసేదాన్జెరచినట్లు వీసము లేనీ
దోసపువృత్తులు సుగుణో
ల్లాసమునంతయును జెరచి గాసింబెట్టున్.

90. కాశీ ప్రయాగ గయలను
దేశములన్ దిరిగి యధిక వేసట పడినన్
దేశికుడులేక మోక్షపు
వాసనబ్రాప్తియులేదు క్లేశంబైనన్.

91. యీ సకలంబని యాపర
మేశుని కృపచేతవెల్గు నా సర్వజ్ఞాం
నీనమంశంబున మనసా
దాసులుగా నున్నయెడల జూసెదవుసుమీ

92. కాసులు వానును గోధుమ
పూసలు మొదలయిన నగలు మెడలో వేయన్
వాసన యధికము జన్మను
తీసిన గుంటలలో నిన్ను ద్రోసును మనసా.

93 తుంటరియు సంశయాత్మను
కుంటెనగా డెపుడు మరికి గుంటలో ద్రోయున్
గంటికి నగుపడుచును మన
వెంటనె దిరుగంగ దాని జంటో దలవుగా

94. చంటి పసిదానివలె నే
నుంటివి బోధలను వినుచునుంటివి దానిన్
బంటువలె సేవజేసియు,
గెంటిన నిన్విడువలేవు వింటివె మనసా,

95. మురికైన కొంపనుండుచు
మరుపనియెడి నంధకారమందు మెరుగుచున్.
మరుగున నాటల నాడుచు
మరువకు మరణంబటన్న మరనేడ్చెదవే.

96. తరియించ నీకుఁ గోరిక
స్థిరముగ నున్నట్టులైన పరమప్రీతిన్
గురియుంచి నీలోనెప్పుడు
హరిహరు లిరువురిని స్మరణయునవే మనసా

97. ఆరమరలేకను వారల
చరణములను హృదయమందు ధారణజేయన్
పరిచర్యలు జేసినచో
మురిపెపు బిడ్డనుగనెంచి కరుణతో జూచున్.

98. నిరుపమ బోధలుజేయగ
నరుగుదు వపుడపుడె నీవు తెరవరివలెనే
నరులతో బొత్తును విడచియు
వరుసగ భువనములుదాటి గురుసన్నిధికిన్-

99. దారిని గనఁగొనిపోయిన
జేరదలచు స్థానమునను జేరునుగానీ
చేరక దిరుగుచునుండే
వారలు యొన్నడును చనగలేరే మనసా.

100 నూరుల కొలదిన శశులకు
మీరినకాంతులచెనొప్పు యూరనగమహా
కారణపురములో లవణము
నీరములో గలయుతీరు నిజమెరుగగదే.

101. ధీరులసంగను తైలపు
కారవలెన్ ధ్యానగలిగి తారెపుడుగనన్
గోరిక లేదయం బందునో
వారలు యాక్షణములోన పారెదరుసుమా.

102. నదముల మగు నీగ్రంథము
జదివిన వ్రాసినను విన్న నరసుల కెల్లన్
కొదువలు గలుగక మోక్షపు
సదనంబును గలుగునెప్పుడు సద్గురుకృపచేన్.

---

## కందార్థములు.

1. స్థూలాంగ భోగముల కను
కూలులమగ సంచరించు కాలంబంతయు
మేలుగను దోచునెంత
కాలముపర్యంతమాదు శ్శీలు శూద్రుండున్
నాలవవర్ణా లీలాకృతుండున్
యీలాగు బోధబుధు లీలాగు జెప్పిరి
తాలిమియున్న నిజమూలము దెలియుడు
శ్శీలు శూద్రుండున్ ॥

2. సంచితము వృద్ధిని బొం
దించును సూక్ష్మాభిమాని కుచిజ్ఞుండై

పంచేంద్రియానురక్తుడై
చంచలుడై వానివెంబడించు భ్రమని ద
లంచదు వాని వంచనల
నించుకైన భయముంచక జన్మల నా
ర్జించువాని వైశ్యుండంచు లోకములోన
నెంచు భ్రమనీ.

3. కారణ యభిమానియనన్
వారిరువుర మూలమైన కారకుడంచున్
సారము శబ్దార్థముల వి
చారించిన దెలియబడును వారందరికిని
మారకుఁగరే వారలెపుడు నా
కారణమున నాధీరుని క్షత్రియు
డేను వారిపరివారముగను దెలియు
వారందరికిని.

4. మూటికి మూలము తురియము
చోటే మహాకారణంబు మాటను వినా న్యా
త్కూటమున నుంచి మీదుగ
నూటికఁజూడంగ నాత్రికుటాద్రిపైన
మేటికాంతి పేటలోదివ్య
పీఠమందున గురుడు కోటిశశాంకుల
ధాటిచే వెలిగెడి వాడే బ్రాహ్మణుడు
కూటాద్రి పైన.

## ఆశ్రమములు.

1. కర్మల మొదటిది యాశ్రమ
కర్మల బంధంబులూడు ధర్మమునాటిక్
మర్మము దెలియక నెన్నియు
ధర్మపు కార్యములుజేయ నిర్మలులమేనా
పేర్మితోజేయ బ్రహ్మానుకనము
దుర్మదులగుచు కార్మికములవలె నీ
జన్మలలో నెపుడు గ్రుమ్మరుచుందుము
నిర్మలులమేనా.

2. గేహమువంటిది యగు నీ
దేహము నేననుట పిచ్చి మోహంబనియున్
నూహల పోహలకును ప్రో
త్సాహకుడుగ నుండునట్టి స్నేహితుని కలియన్
సాహస ధైర్యారోహణ సేయన్
మోహించిన మోక్షలక్ష్మి వివాహితుడై
సోహంభావమునయామహాగృహస్తు దెరిగి
స్నేహితుని కలియున్.

3. మేనను గృహమును విడచభి
మానినియును సతితో లోనకారణ మనెడిన్
కాననమున శ్రీసద్గురు
డానతి చేసిన విధులు పూనికతో జేయున్

నేనియామహాజ్ఞానవంతునీ
వానప్రస్తుండన వానికి జెల్లదా
కానబడునవాడీమానవుల కెపుడైన
పూనికతోను.

4. అన్యేచ్ఛలు లేకనుమా
లిన్యాం తర్గతుడుగాక శూన్యుడుగాకన్
నాన్యంబించక లేదనె
డన్యోన్యస్సమర సైక్యజన్యానుభవుడై

పుణ్యాత్ముడు చైతన్యాదులనెడి
వన్యాదులలోనుండి ధన్యోస్మియను మహా
మాన్యునెపుడు నిజనన్యాసి యనుభవ
జన్యానుభవుడై.

5. చవియనునది తెలియక తన
కవియే సంప్రాప్తమగునో నవియే గొనుచుం
నవిచారియగుచు కోటుల
రవిశశులకు మించివెలుగా దివ్యాదివమందు

నవిరళమైన ధవళాంగముతో
నవధూతయై తిరుగు భువనము లన్నియు
జవదాటకను తనగుర్వాజ్ఞలలో నుండు
దివ్యదివమందు.

# గురుశిష్య సంవాదము.

ఆనంద భైరవి రాగం—ఆటతాళం.

తండ్రి॥

1. సారహీనంబైన నం, సారమును బహుప్రీతితో।
కోరితెచ్చికొంటినేను, నేరకను యోగురువరా॥ బిడ్డా॥

2. కూరిమితోనున్నట్టివేళ, నేరములగుపడకయుండి।
నీరసముకాగనే నీకుభారమాయెనా శిష్యుడా॥

1. క్రూరవృత్తి జాలమునెడు, చోరులతో సంకులంబైనా
ఘోరారణ్యమునందు జిక్కితి, పోరలేనో గురువరా॥

2. ధీరుడై గురుమంత్రమున నా, శూరులను ఖండించ
గానే। చేరవలసిన సుఖస్థానము చేరువగునో శిష్యుడా॥

1. దరిమాలిన జీవులను నరికినట్టి పాపకర్ముడు।
పరమపావను డెట్లగునో, కరుణతో జెప్ప గురువరా॥

2. ఏరులు మూడునుగలసి, పారెడానంగ మేశ్వరము
నకు। జేరిస్నానముజేయ పరి, హారమగునో శిష్యుడా॥

1. మీరిన కాంతితోనొప్పె, డారుగురు దివ్య పురు
షులా। తీరమునకు వచ్చెనెవ్వరు, వారెటకు బోదురు
గురువరా॥

2. ఓరి పుత్రా తేజోరూప ధారులనిబిలువబడు కాంత।
వీరులపుడే। బ్రహ్మపురముకు పారెదరురా శిష్యుడా॥

1, తీరెనా సంశయంబులు పలు, మారడిగితి దెలిపితి రోక । సారియడిగెద బ్రిహ్మపుర మేటిరు నుండునో గురువరా॥

2. వేయరూప క్రియలనెడి తారతమ్యత లేక నే కా। కారమై వెన్నెలవలె గోచరమగునో శిష్యుడా॥

1. తాయనా పూర్వపుణ్యము చే, తారసిల్లి నారిచటకు। దూర మెంత కలదో పోవుదారియెటులో గురువరా॥

2 ధారణయోగమునుబూని, పారజూచిన క్షణము లోనా । పార కాంతిలో నీవుజేరి యొకటౌ శిష్యుడా॥

1 అరయమూ వులలో నం, దరును గుణకర్మలలోన । సరిసమానులా వారందరికి యొకటా గురువరా॥

2 చిరతపాపలజీర్ణశక్తులనెరిగి తగినాహారమిడుచు కొరత లేకను బెంచగనవే, ధరలో తల్లులు శిష్యుడా॥

1. తరచనున్న వెన్న రాదని, తరుచు గా వినియుంటి బోధలో । తరగతు లెన్ని గలవో విరళముగ జెప్పుడో గురువరా॥

2. పరగతిరి విధములనుచు పూర్వము, పరమ పతివ్రిత । యైన గౌరి । పరిచర్యకు పరవశుండై, హరుడు బల్కెనో శిష్యుడా॥

1. విరివిగానడుగుచునేశ్రమ, పరచినను సాటువులతో గన।పరచుచుంటిరా విధంబులనరశి దెల్పుడో గురువరా॥

2. తారకసాంఖ్యా మనస్క తారతమ్యతలు వీనినే। సూరిజనులు బహుప్ర, కారముగ జెపుదు రోశిష్యుడా॥

1. దూర్ధదృష్టితో నెంతజూచిన మీరెగాకను దైవము। వేరెలేడని దోచెను. తారక మెట్టిదో గురువరా॥

2. మరియు మొదటిది మనసుల్లోగల, మరపనుచు మనసుజెప్పెడి। మురికినంతనుతీసి, పరిశుభ్ర పరచు నోశిష్యుడా.

1 తెరపిలేకనడిగి కష్టపరచినను తేటగా దెలియ। పరమచుంటిరి సాంఖ్యపరికరణ మెట్టిదోగురువరా॥

2. నిరుపమానందమై నాత్మను, పరిశీలన జేయుశక్త్యై పరిమితముగ నొసగుమనసు, తెరువుజూపు నోశిష్యుడా॥

1. మారడిగితినను చుచెప్పడను, కోరమనస్క మెట్టిదో కడ। సారిపరిక్షిదిదెల్పుమరల, నోరు తెరువనోగురువరా॥

2. నిరామయాక్షరమైననిజ, స్వరూపమునననుమగ్నుడౌ। చరాచరములన్నిటికి, విరామమది రాశిష్యుడా॥

1. ఈరహస్యంబిదివరలో, నేరికిని బోధించిరో। వారి వెనువెంటను బోదుమీరుజెప్పు డోగురువరా॥

2. నారాయణ దేవమీకు, నారుడనికాజప్పయ్య। పేర బిలువబడెడువాడు, గోరజెప్పితి శిష్యుడా॥

## గురురహస్యం-రగడ.

పాపినిపలుగాకి జెముడ । కోపించండాలుడనేనీ । కాపు
రంబున జిక్కి యమ । కూపమునబడిపరి ।· తాపమంది
నిదురజెందగ । నాపద్బాంధవుడు వచ్చి । లేపె మెల్లగ
నెదుటనిలబడె । నాపతితపావనునికివి ।జ్ఞాపనముసేయగా
కొంత । నేపటికితనకరమునరిగా జా పెనాశిరమునకునడు
మను । మోపెబ్రహ్మనాళమందున । జూపుమలసినిలపి
కను । పాపల నడిదారిబొమ్మని । దీపితంబగు కాంతులు
గల । వాపురంబులొజాతువని । దాపుదారదిపోను
పోను । రూపనామక్రియలులేకే । వైపునను జూచివా
వెలిగెడి। దీపమొక్కటెగానబడునని । యాపరంజ్యోతియే
జీవుల । లోపలనువెలుపలనునిండె గు । రూపదేశంబొంది
పుణ్యులు । తాపసులెల్లకాలంబు । నోపికతోనిష్టను
బూనా । శ్రీపతినిమానసమునందున । నేపుగనారా
ధించి । ప్రాపుగోరి ధన్యులైరని । చూపెజెప్పెకాజప్ప
య్య । కీపరమరహస్యమిటుల । నాపరమపితనిత్యానంద
స్వ । రూపుడిదేరాజయోగ మని । తీపిలోకతితీపిహితోప
దేశముశ్రిద్ధతోవిన । పాపములునశియించు సర్వ । వైపరీ
త్యపూహాలనెడ । బాపుమననినిధిధ్యానలలో న । మీపవ
ర్తులమైపూర్ణ । వ్యాపకత్వముజెందుదుమని । దోపింప
జేసెతండ్రి । దాపకను విన్న కన్నని । క్షేపమును గురు

నాజ్ఞగైకొని । లోపమించుకలేక జెప్పితి । జ్ఞాపకమునం
దుంచుమ స । ద్రూపచిద్రూపానంద । రూపమగు మన
స్వస్వ । రూపమును దర్శింతుమపుడే । లోపముండ
దెచటఁజూచిన । శాపనార్థనలిడకనిందా । రోపణలు
నేయకను వాక్య । లోపములనెంచకను సం । తాపమును
జెందకను । రేపుమాపనిజరపికాల । యాపనముజేయకను
మనమీ ॥ సాపుమార్గమునడువను క్షణ । నేపులోముక్తి
నొందెదము ॥

